

**విజయదశమి**

# విజయం కొరకు విజయదశమి

మానవుడు సహజంగా విజయకాంక్షి. తానున్న రంగంలో విజయం పొందగోరతాడు. ఇంద్రియాలతో పొందే సుఖం క్షణికమే. కాని, విజయం వల్ల పొందే సుఖం - ఆనందం తీపి జ్ఞాపకంగా చిరకాలం ఉంటుంది. రాజులు రాజ్యాలను జయించాలని కాంక్షిస్తే, సామాన్యులు సామాన్య విజయాలను పొందగోరతారు. విద్యార్థులు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులు కాగోరితే, ఉద్యోగస్తులు ప్రశంసాపత్రాలను పొందగోరతారు. క్రీడాకారులు విజేతలు కాగోరితే, కళాకారులు ఆయా కళలలో అగ్రగణ్యులు కాగోరుతారు. భారతీయార్యుల ధర్మగ్రంథాలైన వేదాలు విజయం కోరేవారు పూర్ణ పురుషార్థం చెయ్యాలంటాయి. ఈ విధంగా సంకల్పించమంటుంది అథర్వవేదం.

**ఓం కృతం మే దక్షిణే హస్తే, జయో మే సవ్య ఆహితః ।**
**గోజిద్ భూయాస మశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్ ॥** -
అథర్వవేదం 7-50-8

పూర్ణ పురుషార్థం కుడిచేతిలోనున్న నాకు అలవోకగా జయం నా ఎడమ చేతికి లభించుటలో సందేహమేమున్నది? నేను విశాలమైన భూభాగమును జయింతునుగాక! గో అశ్వ సంపదలను, ధనరాశులను సువర్ణ రత్న రజితాదులను జయింతునుగాక! పొందుదును గాక!

పురుషార్థం అంటే - విశేషమైన కృషి - పరిశ్రమ - ప్రయత్నం. అది పూర్ణంగా ఉండాలి. మన శక్తులన్నిటిని ఒడ్డి ప్రయత్నించాలి. అది ఉన్న వ్యక్తి తాననుకొన్నది సాధించగలుగుతాడు. అందుకనే **"సాధనమున పనులు సమకూరు ధరలోన"** అన్నారు పెద్దలు.

ఈ పూర్ణ పురుషార్థంతోబాటు పరమేశ్వరుని సఖ్యతయూ అవసరమే

నంటుంది వేదం. **'వయం జయేమ త్వయా యుజా'** (ఋగ్వేదం 1-102-4) హే పరమేశ్వర! నీ సఖ్యతతో మేము జయింతుము గాక! మనం ఎంచుకొన్నది ధర్మమార్గమైనపుడే అంతర్యామియైన పరమేశ్వరుని నుండి మంచి ప్రేరణ ప్రోత్సాహం కలుగుతాయి. అందుకు కావలసిన శక్తియుక్తులు, సహాయ సహకారాలు లభిస్తాయి. కనుక, విజయాన్ని కోరుతూ జరుపుకునే ఈ విజయదశమి పండుగనాడు పరమేశ్వరుని స్తుతి ప్రార్థనలు, విశేష మంత్రాలతో బృహత్ యజ్ఞం చెయ్యటం మంచిది.

అథర్వవేదం 3వ కాండలోని 19వ సూక్తంతో ఈ విశేష హోమం ప్రారంభింపబడుతుంది. 8 మంత్రాలు గల ఈ సూక్తానికి దేవత పురోహితుడు. ఇచ్చట పురోహితుడంటే గుళ్ళల్లో పూజలు చేసే పూజారులు కారు. పురానికి లేదా దేశానికి హితం చేసే రాజులు, నాయకులు అని అర్థం. వారి సంకల్పం ఎలా ఉండాలో ఈ మంత్రాలు నిర్దేశిస్తాయి. వీటిలో మొదటి మంత్రం ఈ విధంగా ప్రేరేపిస్తుంది.

**ఓం సంశితం మ ఇదం బ్రహ్మ సంశితం వీర్యం బలమ్ ।**
**సంశితం క్షత్రమజర మస్తు జిష్ణు ర్యేషా మస్మి పురోహితః ॥**
- అథర్వవేదం 3-19-1

"మా దేశ బ్రాహ్మీశక్తిని - విద్యా విజ్ఞానవేత్తలను ఎట్టి పరిస్థితులలోనైనా ఎదుర్కొనటానికి సిద్ధం చేశాను. మా దేశ బలవీర్యాలు ఎట్టి ఆపదలనైనా ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉన్నాయి. మా దేశ క్షాత్రశక్తి (సైనికశక్తి) ముసలితనమెరుగని నిత్య యౌవ్వనంతో జయశీలమై యున్నది. అట్టి దేశానికి నేను పురోహితుడనని - నాయకుడనని చెప్పుకొనుటకు గర్వించుచున్నాను."

మిగిలిన మంత్రాలలోనూ ఇట్టి భావాలే ఉన్నాయి. "మా శస్త్రాస్త్రాలు తీక్షణముగా వజ్రతుల్యంగా ఉన్నాయి. శత్రువు లెంతటి బలవంతులైనా అవి చీల్చి చెండాడగలవు. సదా మా వీరులు జయఘోషలు చేస్తారు. అట్టి దేశానికి నేను పురోహితుడను - రాజును - నాయకుడను" అని పురోహితులు - నాయకులు సంకల్పించాలంటాయి.

ధన కనక వస్తు వాహనాల నెన్నిటిని సమకూర్చుకున్నా వాటిని రక్షించగల

క్షాత్రశక్తి – సైనికశక్తి ప్రతీదేశానికి అవసరం. ఇంతేగాక, వారికి కావలసిన ఆయుధాలూ అవసరమే. కనుక, అవసరాన్నిబట్టి ఆధునిక ఆయుధాలు సమకూర్చుకోవాలి. ముఖ్యంగా విజయదశమిని ఆయుధపూజగా జరుపుకుంటారు. పై మంత్రంలోని 'సంశిత' పదం ఆయుధాలను పదును పెట్టుకుని సిద్ధంగా ఉంచుకోమంటుంది. ఎటువంటి ఆపదనైనా ఎదుర్కోవటానికి సిద్ధంగా ఉండమంటుంది.

పూర్వకాలంలో ప్రతీ వ్యక్తి ఏవైనా ఒకటి, రెండు ఆయుధాలు ప్రయోగించటం నేర్చుకునేవారట. కాని, దేశకాల పరిస్థితులు మారి నేడు ఆత్మరక్షణకైనను ఆయుధాలు ధరించటం నేరమౌతున్నది. చట్టాన్ని మన చేతుల్లోకి తీసుకోకూడదట!! అయినప్పటికీ మన ప్రాచీన సాంప్రదాయాన్ననుసరించి కఱ్ఱ, కత్తి సాముల వంటివైనా నేర్చుకొని ఉండాలి. కరాటె వంటిదైనా కొంత సాధన చెయ్యటం మంచిది. ప్రాచీన వీర పురుషుల జయగాథలను పాడుకుంటు విజయయాత్రలుగా ఊరేగింపులు జరుపుకోవడం మంచిది.

జమ్మిచెట్టు రథాలు, బాణాలు మొదలైన వాటిని చేయటానికి అనువుగా – గట్టిగా ఉంటుందట. అందుకనే ఆరోజు సాయంత్రం జమ్మిచెట్టు కొట్టి తెస్తూ ఉంటారు. జమ్మి ఆకులు పెద్దల చేతులలో పెట్టి పాదాలు మ్రొక్కి ఆశీస్సులు తీసుకుంటారు.

ఈ చెట్టును సంస్కృత భాషలో 'శమీవృక్ష' మంటారు. 'శమము' అనే పదానికి ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము అనే అర్థాలు కూడా ఉన్నాయి. తనలోని అరిషడ్వర్గాలను జయించినవాడే బయట శత్రువులను అణచగలుగుతాడు. కనుక పెద్దల ఆశీస్సులతో ముందుగా మనలోని కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను జయించాలి.

విజయకాంక్ష క్షత్రియులయందేగాక జన సామాన్యంలోనూ కనబడుతుంది. అందుచేతనే ప్రజలందరూ ఆయా వృత్తులకు చెందిన పనిముట్లను శుభ్రపరచుకొని పదును పెట్టుకుని అలంకరించి కర్పూర నీరాజనాల నిస్తారు. వాహనాలైన సైకిలు, స్కూటరు, కారు మొదలైనవాటిని అలంకరించుకుంటారు. కర్పూర నీరాజనాలకన్న ఘృత ఓషధులతో హోమం చేసుకొని హోమం వాయువులతో నీరాజనాలివ్వటం

ఉత్తమం. పర్యావరణం కూడా శుద్ధమౌతుంది. సాయంత్రం అందరూ ఊరేగింపుగా ఊరు ఆవలకు వెళ్ళిరావటం, శమీపత్రాలు తెచ్చుకోవటం, మన ప్రాచీన వైభవాన్నీ, శ్రీరామ శ్రీకృష్ణ పాండవాదులను, మధ్యకాలీన రాణాప్రతాప్, వీర శివాజీ, ఝాన్సీ లక్ష్మీబాయి, రాణి రుద్రమదేవి వంటి వీరులను, వీరవనితలను తలచుకొని ప్రేరణను పొందటం చేయాలి. మనం కూడా నియమంగా నిత్యం యోగ వ్యాయామ ప్రాణాయామాదులను, దండ బస్కీలను చేస్తూ శారీరక బలాన్ని, ఉన్నతిని పొందాలి. ఆత్మరక్షణకై కఱ్ఱసాము, కత్తిసాము, కరాటే వంటివి నేర్చుకోవాలి. అప్పుడే మనం విజయం కొరకు విజయదశమి పర్వాన్ని జరుపుకున్న వారమౌతాము. అస్తు.

## విజయదశమి

ఆశ్వయుజ శుద్ధ దశమి విజయదశమి పండుగగా భారతీయులలో వైదికులు భావించి, నాడు విజయోత్సాహముతో సమయము గడుపుదురు. పండుగలలో ఆశ్వయుజ శుద్ధ 10, ప్రసిద్ధ పండుగ దినము.

### విశేషాహుతుల మంత్రములు

ఓం సంశితం మ ఇదం బ్రహ్మ సంశితం
వీర్యం బలమ్ । సంశితం క్షత్ర మజర
మస్తు జిష్ణుర్యేషామస్మి పురోహితః ॥స్వాహా॥

ఓం సమహమేషాం రాష్ట్రం స్యామి సమోజో
వీర్యం బలమ్ । వృశ్చామి శత్రూణాం
బాహూ ననేన హవిషాహమ్ ॥స్వాహా॥

ఓం నీచైః పద్యన్తామధరే భవన్తు యే నః
సూరిం మఘవానం పృతన్యాన్ । క్షిణామి
బ్రహ్మణా మిత్రా నున్నయామి స్వానహమ్ ॥ స్వాహా॥

ఓం తీక్ష్ణీయాంసః పరశో రగ్నేస్తీక్ష్ణతరా ఉత ।
ఇంద్రస్య వజ్రా త్తీక్ష్ణీయాంసో
యేషామస్మి పురోహితః ॥స్వాహా॥

ఓం ఏషామహమాయుధా సంశ్యా మ్యేషాం
రాష్ట్రం సువీరం వర్ధయామి । ఏషాంక్షత్రమజరమస్తు

జిష్ణ్వేషాం చిత్తం విశ్వేఽ‌వస్తు దేవాః ॥స్వాహా॥

ఓం ఉద్ధర్షన్తాం మఘవ న్వాజినా న్యుద్వీరాణాం
జయతామేతు ఘోషః । పృథగ్ ఘోషా ఉలులయః
కేతుమన్త ఉదీరతామ్ దేవా ఇన్ద్రజ్యేష్ఠా
మరుతో యన్తు సేనయా ॥స్వాహా॥

ఓం ప్రేతా జయతా నర ఉగ్రా వః సన్తు బాహవః ।
తీక్ష్ణేషవో బలధన్వనో హతో
గ్రాయుధా అబలానుగ్ర బాహవః ॥స్వాహా॥

ఓం అవసృష్టా పరాపత శరవ్యే బ్రహ్మసంశితే ।
జయామిత్రాన్ ప్రపద్యస్వ జహ్యేషాం
వరంవరం మామీషాం మోచి కశ్చన ॥స్వాహా॥

(అథ. 3-19-1 నుండి 8 వరకు)

ఓం యే బాహవో యా ఇషవో ధన్వనాం వీర్యాణిచ
అసీన్పరశూనాయుధం చిత్తాకూతం చ యద్ధృది ।
సర్వం తదర్బుదే త్వమమిత్రేభ్యో
దృశే కురుదారాంశ్చ ప్రదర్శయ ॥స్వాహా॥

ఓం ఉత్తిష్ఠత సంనహ్యధ్వం మిత్రా దేవజనా
యూయమ్ । సందృష్టా గుప్తా వః సన్తు
యా నో మిత్రాణ్యర్బుదే ॥స్వాహా॥

ఓం ఉత్తిష్ఠత మారభేథాం ఆదానసందానాభ్యామ్
అమిత్రాణాం సేనా అభిధత్త మర్బుదే ॥స్వాహా॥

(అథ. 11-9-1 నుండి 3 వరకు)

